శ్రీమద్గురవేనమః.

# చంద్రశేఖరస్తోత్రమాల

ఉ॥ శ్రీకర యోగిమానసవశీకర హైమవతీముఖాబ్జశో।
భాకర సంతతామితకృపాకర సర్వసుపర్వజాలర। క్షాకర భ
క్తకైరవనిశాకర వాసుకిముఖ్యదివ్యద। ర్వీకరభూషణా కరు
ణ వేగమ బ్రోవర చంద్రశేఖరా॥ ౧॥

ఉ॥ ఈశ పదాబ్జనమ్రవిజేశ శరద్ఘనహారహీర నా। కేశ
గజేశభేశ్వర మృగేశ తుషార పయోంబురాశి సం। కాశ గిరీ
శ భక్తహృదఘాఘవినాశ కైలాసవాస స। ర్వేశ కటాక్షవీక్ష
ణల నేలగదే నను చంద్రశేఖరా॥ ౨॥

ఉ॥ ఇనశశివహ్ని నేత్ర వృషభేశ్వరపత్ర జగత్పవిత్ర స। జ్జన
వనచైత్ర దేవగణసన్నుతపాత్ర ధనేశమిత్ర పా। వనసుచరిత్ర
క్లృప్తతమస్సరసీసుహామిత్ర నీదు। పద్వనజములాశ్రయించితి
ముదంబున బ్రోవర చంద్రశేఖరా॥ 3॥

ఉ॥ జాలము జేసెదేల సురసన్నుత దివ్యచరిత్రజాల ల। శ్రీ
లలనాధిపాభినుతశీల కరాంచితశూల మానిహృల్లోల యశో
విశాల రిపులోకకరాల విపత్పయోదవా। తూలఘృణాలవా
ల దయతో నను నేలుము చంద్రశేఖరా॥ ౪॥

చ॥ జలధిగభీర దుర్ధర్మమదయుశత్రుధరాధరవజ్రధార ని।ర్మ
ల సువిచార భక్తజనమానసపుష్కరసూర దాంచనా। చల స
మధీర ఘోరతర సంసృతివార్నిధికర్ణధార ని। శ్చలమతి ని
న్ను గొల్చెదను సత్కృప నేలుము చంద్రశేఖరా॥ ౫॥

ఉ॥ దండమొనర్తు నీకు గజదానవచర్మతరండ మేరుకో।దం
డ నభోశిఖండ శరదభ్రసదృగ్ఘనపిండ హంసప। తాండలస
త్ప్రచండ సమదారిసరోరుహదండమత్త వేదండ ననున్। భవ
చ్చరణదాసుని నేలుము చంద్రశేఖరా॥ ౬॥

ఉ॥ పుంగవరాట్తురంగ మునిపుంగవ చిత్తసరోజసంచర।
ద్భృంగ రణారిభంగ ఘనదేవనదీవిలసద్వరాంగ వి। శ్వాంగ
శయాంచితోజ్జ్వలకురంగ। మృణాకలితాంతరంగ ని। స్సంగ
మదీప్సితంబుల నొసంగుము చెచ్చెర చంద్రశేఖరా॥ ౭॥

ఉ॥ మాయకు జిక్కి ధాత్రి ననుమానమనస్కుడనైతి సం
హృతా। కాయ పళాసపూర్వరనికాయ సమస్తఖలాచలాశ
ని। పాయ ఘనాభిధేయ నిరుపాయ విచక్షణగేయ యోగి
హృ। ద్ధ్యేయవశత్రుకాయ నను దీనుని నేలుము చంద్ర॥ ౮॥

ఉ॥ కూరిమితోడ నిన్నెపుడు గొల్చుచునుండెడి నన్ను
బ్రోవరా ని। ష్కారణ విశ్వసంజనన కారణ సంసృతివారిరాశి
నౌ। కారణ ఘోరదుష్కృత విదారణ సంతతసాధుకష్ట నివా
రణ భక్తమానస విహారణ ధీరణ చంద్రశేఖరా॥ ౯॥

ఉ॥ దేహమునన్ తనూరుహ సతీహిత బాంధవ భృత్యమిత్త్ర స । ద్గేహములందు మోహము నొకింతయు విన్వగలేక ఘోరసం । దేహపయోధి మగ్నులయి తీరము గానగ నేరకన్ శివై। వాహమటన్న మాత్ర ఘనులౌదురె మూఢులు చంద్ర॥

ఉ॥ వేదములన్నియుం జదివి వీనులవిందుగ జెప్ప నేర్చినన్। మేదిని గడ్డముం జడలు మీసలు బెంచి పలాశకందమూ। లాదికముల్ భుజించుచు మహాగహనంబుల సంచరించినన్। భేద మనస్కులౌ నరులు నిన్ గననేర్తురె చంద్రశేఖరా॥ ౧౧॥

ఉ॥ ముక్కులుమూసి గూర్చునిన మూలమెరుంగక మంత్రజాలముల్ । బెక్కులు వల్లె వేసినను బిడ్డల నాలి దొరంగిబోయినన్ । గొక్కెరలట్లు ధ్యానముల గూర్కిననైన నమేయమైననీ। నిక్కపురూపమున్ గనగ నేర్తురె మూఢులు చంద్ర॥

చ॥ తలపగ సద్గురూక్తి వనితాసుత బంధుహితార్థమందిరం। బులయెడ మోహమున్ విడిచి ముక్త్యవశాంతవిశిష్ట దివ్యచి। త్తులరయి రాగదోషముల దోలి వివేకఖరాసి జన్మబం। ధలతల ద్రెంచువారలుగదా నినుగాంతురు చంద్ర॥

ఉ॥ చుట్టగవచ్చు చాపవలె చోద్యము నెల్లరుబొంద ధారుణిన్। బట్టగవచ్చు ముష్టిని నభంబును సప్తకులాచలంబులన్। గొట్టగవచ్చు పిండివలె గొబ్బునగాని మనంబు నేరికిన్। బట్టగశక్యమానె నిజభక్తవశీకర చంద్రశేఖరా॥ ౧౪॥

ఉ॥ చేయగవచ్చుస్నానములు చీకటితోడనె లేచి నెమ్మె యిన్ । బూయగవచ్చునెంతయు విభూతిని పొంకముగా ధరిత్రి కా। మాయములన్ ధరించనగు జక్కగపింజలు వెట్టి మాలికల్। వేయగవచ్చుగాని సువివేకముతో దమచిత్త మెందుబో। నీయెడ నిశ్చలంబుగను నిల్వగ శక్యమె చంద్ర॥ ౧౫॥

చ॥ ఇరువదియైదు తత్వముల కీశుడవంచును జన్మకర్మబం। ధరహితమూర్తివంచును స్వతంత్రుడవంచును సర్వగుండ వం। చరసి నినుం గనుంగొను మహాత్ములు నిచ్చలు ముక్తికామినీ। సురతసుఖానుభూతులను జొక్కుచునుందురు చంద్ర॥ ౧౬॥

చ॥ ఎరుగరొ జీవకోటులకు నెల్లను మృత్యువు దప్పదంచు దా। రెరుగరొ సీటిబుగ్గగతి నైల్లసిరుల్ క్షణభంగురంబులం। చెరిగి యెరింగి నిన్ గొలువనేరక వెంగలులట్లు భ్రాంతులై। దిరిగెదరేమొకో జనులు దెల్పవె నాకిల చంద్ర॥ ౧౭॥

చ॥ ధనములగోరి యన్యులకు దాసులపై జరియింత్రుగాని సజ్జనవర సంగతిన్ జలుల సంసరణాబ్ధి దరింపజేయు నిన్ను నిశము భక్తిగొల్చుచు నిరంకుశ తృప్తిని బొందగోర రీ। జనులు వివేకహీనులయి సత్యసుఖాకర చంద్రశేఖరా॥ ౧౮॥

ఉ॥ మూటిని దుంచివేయకను మూటినిగెల్వక మూటి రోయకన్ । మూటి నరుంగ నేరకను మూటిని గీటడగించ కింకము । మ్మూటిని నట్లు కీలు గొను మూలముగా నెరుగంగలేకనే। మాటలచేత నెట్లు నిను మస్తులుగా నెతు చంద్ర॥ ౧౯॥

ఉ॥ ఆరిటి జిక్కఁబట్టి మఱియారిటి జెంపలుఁగొట్టి దోలిలో। నారిటిగుట్టెఱింగి వరహంససహాయ్యముచే ద్రికూటముం। జేరి సదాశివున్ నినుభజింపమిగాదె విమూఢులెల్లసం। సారపయోధి బుట్టుచును జచ్చుచునుందురు చంద్ర॥ ౨౦॥

చ॥ పొలియునె సందియంబు మరి బోవునె దుఃఖము లేశమైనని। యిల హఠయోగసాధనల నెన్నిటినైన చిదాత్మరూపునిం। దెలియక బోవునే తమము దీపిక లేక వృథాభిలాషులై। సలుపుచు నుందురేగాక నతసజ్జనసంచయ చంద్ర॥ ౨౧॥

చ॥ చరణకరాక్షియుగ్మములు పద్మలజాతములో సుషుమ్నయో। స్మరసదనంబు చిన్నభమొమధ్యము యూరు భుజంగియొక్కొ యా। సురతము యోగమొక్కొ సరసోక్తులు వేదశిఖోక్తులొక్కమై। మరతురు ధాత్రి స్త్రీలనిన మాత్రనె మర్త్యులు చంద్రశేఖరా॥ ౨౨॥

చ॥ నిను భజియించెగాదె మహనీయగుణుండు ధ్రువుండు పొందెనే। ప్లను జెడనట్టిలోకమును బొందె చిరాయువు నామృకండునం। దనుడు నలుండుపొందె నిజదారను దొల్లిటి రాజ్యమున్ దయా।వనధివి భక్తవత్సలుఁడవౌటను మావర చం॥

చ॥ గురుతరభక్తి నిన్నెపుడు గొల్చెడివారల కెద్దివెల్తివి। స్ఫురదురురత్నజాల సురభూరుహ ధేను ముఖప్రభూతులం। బరగు సువర్ణపర్వతము భాసురరూప్యధరాధ్రమున్ నిధీ। శ్వరు

మును నీకు విల్లుగ నిశాంతముగా శెలిగా జెలంగ శం। శర నిగ
మాంతవేద్య యవికార పరాత్పర చంద్ర॥ ౨౪॥

చ॥ ద్విరదము శేలురీతి యల దిన్ననిగాచిన మాడ్కి
లూతయన్ । ఖురువును సత్కృపామతిని బ్రోచినభంగి భు
జంగము న్మహా। దరమున సాకినట్టుల ముదంబున వేళ్యాలమన్ను
పోల్కినీ। చరణసరోజభక్తు నను సాకుమటంటిని చంద్ర॥ ౨౫॥

చ॥ నరుడవట్టైన నీదుఘన నామము నోట వచించుమా
త్రనే। దొరగును పాపపుంజములు దుఃఖముల్లెల్లను బాయుని
న్ను సు। స్థిరమతి గొల్చువారలకు జేకురు నయ్యఖిలేష్ట సిద్ధు
లున్। దర,మె నుతింప నీపరమతత్వమహత్వము చంద్ర॥ ౨౬॥

చ॥ అమగను దివ్యరత్న వివిధాభరణాంబరవస్తుజాల మే।
నడుగను వారణాశ్వ నివహంబులు మేడలు మిద్దె లింక ని।
న్నడుగను మోక్షమొక్కడునునా మరియెవ్వియు నిక్కవం
బునీ। యడుగులె యాన జూపుము ముఖాబ్జము నాకిల చంద్ర॥

ఉ॥ ఎవ్వరు పేర్మిమీర నుతియించెదురు నీసుగుణవ్రజంబు
నిం। కెవ్వరు యుష్మదంఘ్రియుగ మెల్లపుడున్ భజియింతురి
భక్తితో। నవ్విమలాంతరంగులకు నాపదలెల్లను బాయు సౌ
ఖ్యముల్। నివ్వటిలున్ జనున్ గొలలు నిక్కము నిక్కము చం॥

ఉ॥ విశ్వపతిన్ పరాత్పరుని విశ్వజనిస్థితినాశ కారుణిన్।
విశ్వశరీరు నవ్యయుని విశ్వనియామకు విశ్వవేద్యునిన్। విశ్వ
ఫలప్రదున్ గురుని విశ్వశరీర విహారి నక్షరున్। శాశ్వతు ని
న్ను నెల్లపుడు సన్నుతిజేసెద చంద్ర॥ ౨౯॥

ఉ॥ బూదినిబూసి పాపతోడవుల్‌దొడి తామరచాలి పున్కనుం। జేధరియించి గిబ్బిపయి నెక్కియు బిచ్చకు బోయె దేలనీ। కేదికొరంత వెండిమల యిల్లును బంగరుకొండవిల్లు బా। బాదొరరాతు నెచ్చెలియు బాగుగగల్గగ చంద్ర॥ ౩౦॥

చ॥ ముకురమ దేటికంధునకు ముక్కిడి కేటికి పుష్పచందదనా। దికనిచయంబులేడునకు దివ్యనినాదములేల నానపుం। నకునకు కామినీసురత సౌఖ్యమనోరథమేల నీమపా। దకమల సేవ దుష్టునకు ధారుణినేటికి చంద్ర॥ ౩౧॥

చ॥ సురుచిరరత్నజాలముల శోభిలు బంగరుమేడలందున। స్పురసల తోడ పుష్పమయశయ్యల చక్కరవింటివానిసం। గరముల నోలలాడెడి సుఖంబులు నీపదవారిజాతసం। స్మరణజముల్లవంబునకు సాటియె యాతియ చంద్ర॥ ౩౨॥

ఉ॥ వేగము రక్షటంటి మనవినేదయతో వినుమంటి వింక నీ। వేగతింయుంటి నన్నేలను వేడగ నామనసొప్పదంటి పు। ర్వాగమ పూజితుండవని వాంఛలుదీర నుతించుచుంటి నీ। వీగతి జాగుసేయ నను నెవ్వరుబ్రోతురు చంద్ర॥ ౩౩॥

చ॥ తగునటరా భవచ్చరణదాసుడనా నను జాలిలేక ని। ట్లుగ ఘనశోకవారినిధి ద్రోయుటనీకిది నిన్నసంగనే। లగటక టాతరంబగునె పాణిగ్రహమందొనరించినట్టి క। ర్మగతి నతిక్రమింప నల బ్రహ్మాదులైనను చంద్ర॥౩౪॥

చ॥ సదమల హేమసన్నిభ వసాంతచతుర్వర వర్ణవిస్ఫుర।

త్పదనచతుష్కమై విబుధసన్నుతమై దగు మూలచక్రమం। దు
దయవిభాకరోపమ సముజ్వలకాంతులదస్మిమూలినా। గదనరు
నిన్నుగొల్తు త్రిజగద్గణవందిత చంద్ర॥ ౩౫॥

చ॥ శలభములెన్నియేసియు నుమర్భ్యధుగప్పగ నోపనట్లు
నీ। సలిలజతుల్యపాదయుగ సంస్మరణంబు లహర్నిశంబులం।
దలయక సల్పువారల గ్రహాదికదోవము లించుకేనిబా। ధల
నొసరింపజాలవని తథ్యముగా బుజ మెత్తి బల్కెదన్। ఖలజన
భీకరా వరఘృణాకర శ్రీకర చంద్ర॥ ౩౬॥

చ॥ లలితబలాంతవర్ణ చపలానివహాభ రుచిప్రదీప్యమ।
ద్దళజల జాంతరంబున సుదర్శన శంఖగదాబ్జ ధారివై। జలరు
హ గర్భనామమున సాంద్ర దయామయ విగ్రహుండవై। యు
లరెడి నిన్నుగొల్చెద నహర్నిశముల్ మరి చంద్ర॥ ౩౭॥

చ॥ అసితడ పాంతవర్ణముల నందముగా విలసిల్లు నీలమే।
ఘసమదశారవారిరుహగర్భమునన్ భసితాను లేపన। ప్రసిత
శరీరివై వృషభరాడ్ధ్వయుమొప్పగ రుద్రనామస। ల్లసితుడవైన
నిన్ను ననురక్తిని గొల్చెద చంద్ర॥ ౩౮॥

చ॥ అమల మఖండ మద్భుత మనాద్య మనామయ మవ్య
యంబచిం। త్యమజమనంతమాద్య మనవద్య మగోచర మ
ద్వయంబబా। ధ్యమనఘ మప్రతర్క్యము ప్రధానము నా
భవదీయ దివ్యత। త్వము నెరుగంగశక్యమె విధాతకునైనను
చంద్రశేఖరా॥ ౩౯॥

చ॥ ఉవిదలమూయులన్ గెలువనోవ కటంచెననేల లాతు
లన్। బుప్పు విలుకాని గందమటు బూదిరొనర్చినయట్టి నీ వె
మేన్। నవమొళ లేమకిచ్చి రొటకచానను గెంటెడలందు బెల్లు
మ। క్కువజివు రొత్త నిల్పగ నకుంఠిత విక్రమ చంద్ర॥ ౪౦॥

ఉ॥ ఏమహనీయునామము రమేశవిరించి సురాధినాథము।
ఖ్యామర బృంద మెంతయును గాదివి సంస్మరియించి బొంది
రో। కాముము లెల్ల నట్టిఘనకల్మషతూలదవాగ్నిదైన నీ। నా
మమహర్నిశంబు లెద నమ్మి స్మరించెద చంద్ర॥ ౪౧॥

చ॥ వరపృథగాత్మతాహ్వయ కృపాణమునుం దయసేయు
వైతివీ। నరులకదేమొగాని కరుణామతి నిచ్చితివేని వేగదు।
ర్భరజని మృత్యుపాశఘన బంధములం దెగగోసి వైచి ము।
క్తిరమణితో స్వతంత్రులయి క్రీడలుసల్పరె చంద్ర॥ ౪౨॥

ఉ॥ నీవజుమీ మదీయజననీ జనకాది సమస్తబంధువుల్
నీవ గురుండ వాప్తుడవు నీవమనోరథ సిద్ధిదుండవున్। నీవఘ।
నంబు నాగతియు నీవ యటంచును నమ్మియుంటి నీ। భావమ దె
ట్టులున్నదో యపారకృపాన్విత చంద్ర॥ ౪౩॥

ఉ॥ ఎంతయు నిన్ను వేడిన నదేమొకో బల్కకయుంటి వ
క్కటా। పంతము బూనినాడవ కృపారహితాత్ముడవా శిలా
మయ। స్వాంతుడవా హలాహలము ద్రావుటమేను నరుం
గకుంటివా।యింత యుపేక్ష సేయుటకు హేతువదేమిర చంద్ర॥

చ॥ బనవని గావబోయితివొ బ్రహ్మకపాలము చేత బూని
యే। దెసలకు బిచ్చకేగితివొ దీనునివేషముతోడ లేక నీ। నిను

వున కాలుదెచ్చుటకు నెచ్చటకేనియు బోయినావొ నీ। దు స
తుల పోరుచే గలుగు దుఃఖముచే దిగులొందు చుంటివో।
యసదృశ యేలరావయితివయ్య మొరల్విని చంద్ర॥ ౨౫॥

ఉ॥ ఎట్టిదొ బ్రహ్మ మంచనగ నేగతి వాడొకొ జీవుడీజగం।
బెట్టిదొ యెట్లు గల్గెనొకొ యేక్రియ జీవుడె బ్రహ్మమౌనొయీ।
గుట్టు నెరుంగ దెల్పుమని కోరిభజంచుచునుంటి నిన్నునీ। వె
ట్టుల దెల్పెదో నుగుణహీనుడ మూఢుడ చంద్ర॥ ౨౬॥

చ॥ జలధితరంగజాలముల చాడ్పున బుట్టుచు వృద్ధి బొం
దుచున్। విలయము నొందుచున్ మరల వేగమబుట్టుచు బో
వుచుందు వు। త్తులిటుల యాదనిశ్చలత దోప దహా నిమిషంబ
యేని యెట్టులనిను గొల్వనేర్తు నొకదుం దయదెల్పుము చం॥

చ॥ జలనిధి విస్తరంగత గృశానుడు శీతలతన్ రసంబు నిశ్చ
లత స్వభావతన్ నిశిని సప్తహయోదయమున్ దివంబునన్।
జలజరిపూదయం బెపుడు జక్కగగల్గునో యప్డుగాని చం। చ
లరహితంబుగాదు మనసంచు దలంచెద చంద్రశేఖరా॥ ౨౮॥

నేరెళ్లవంశరత్నాకరసుధాకరులగు నారా
యణమూర్తి గారిచేవిరచితమైన
చంద్రశేఖరస్తోత్రమాల
సంపూర్ణము.

శ్రీమద్గురవేనమః.

# సుజ్ఞానరత్నమాల.

## ఉత్సాహవృత్తములు:

కాను నేను మనంబు బుద్ధియు గా నహంకృతిచిత్తముల్। గా
ను శ్రోత్రము త్వక్కు జిహ్వయుగాను నేత్రముఘ్రాణమున్।
గాను వాక్పదపాణ్యుపస్థలు గాను పాయువునారయన్। వీని
నెల్ల వెలుంగ జేయుచు విశ్వసాక్షి గనుండెదన్॥ ౧॥

కాను భూమిజలంబునగ్నియు గాను వాయునభంబులున్।
గాను శబ్దము గాను స్పర్శము గాను రూపరసంబులున్। గాను
గంధము నిత్యసచ్చిదఖండసౌఖ్యమయుండనై। వీనినెల్ల వె
లుంగజేయుచు విశ్వసాక్షి గనుండెదన్। ౨॥

కాను ప్రాణము గానపానము గాను వ్యాన ముదానమున్।
గాను నేనుసమానవాయువు గాను బ్రహ్మనువిష్ణుడన్। గాను
రుద్రుడ నీశ్వరుండను గా సదాశివమూర్తి నే। దీనినెల్ల వెలుం
గజేయుచు విశ్వసాక్షి గనుండెదన్॥ ౩॥

కానుశుక్లము గానురక్తము గానుపీతమునీలమున్। గాను
దీర్ఘము గాను హ్రస్వము గాను పీనముకుబ్జమున్। గాను సత్వ

రజస్తమంబులు గాను భోక్తనుభోజ్యమున్। వీనినెల్ల వెలుంగజే
యుచు విశ్వసాక్షిగనుండెదన్॥ ౪॥

కానుబ్రాహ్మణుడన్ నృపుండను గాను వైశ్యుడ శూద్రు
డన్। గాను నేనల బ్రహ్మచారిన్నిగాను నేను గృహస్థుడన్। గా
ను భిక్షుకుడన్ వనస్థుడ నాకు లేవివియారయున్। వీనినెల్ల వె
లుంగజేయుచు విశ్వసాక్షిగనుండెదన్॥ ౫॥

లేదు ధర్మమునర్థమున్ మరిలేదు కామము మోక్ష
మున్। లేదురాగము లేదు ద్వేషము లేదు లోభము మో
హమున్। లేదుగర్వము మత్సరంబును లేదసూయయుదంబ
మున్। భేదబుద్ధిదొరంగిజూడగ విశ్వసాక్షిగనుండెదన్॥ ౬॥

లేదుపుణ్యము లేదుపాపము లేదుమృత్యువు జన్మమున్।
లేదుదుర్గతి లేదుస్వర్గము లేదుసౌఖ్యము దుఃఖమున్। లేదు
బంధము లేదుమోక్షము లేదునాకుదలంపగన్। భేదబుద్ధి
దొరంగిచూడగ విశ్వసాక్షిగనుండెదన్॥ ౭॥

కాను నేనుగురుండ శిష్యుడగాను బోధయు బోధ్యమున్,
ధ్యానధారణలున్ సమాధియునాకులేవు దలంపన। జ్ఞానజాడ
ల తత్వజాలము గాను నేనవికారినై। వీనినెల్ల వెలుంగజేయు
చు విశ్వసాక్షిగనుండెదన్॥ ౮॥

నేన దేహమటంచు కొందరు నేమనంబని కొందరున్। నే
న ప్రాణమటంచు కొంద రనేకరీతుల నిట్టుల। జ్ఞానులై భ్రమ

యించుచుండిరిగాని గానొకశైవమున్ । వీనినెల్ల వెలుంగజే
యుచు విశ్వసాక్షిగనుండెదన్॥                    ౯॥

కానుస్థూలము గాను సూక్ష్మము గాను కారణ దేహమున్।
గాను జాగ్రత గాను స్వప్నము గాను నేను సుషుప్తియున్। గా
ను విశ్వుడ తైజసుండను గాను ప్రాజ్ఞుడనారయున్। దీనినెల్ల వె
లుంగ జేయుచు విశ్వసాక్షిగనుండెదన్॥                    ౧౦॥

సుజ్ఞానరత్నమాల సంపూర్ణము.

గ్రంథకర్తగారిపై కృతి.

గీ॥ వాసికెక్కిన నేరళ్ల వంశజలధి। చంద్రమా నీదు సుగుణ
ముల్ సన్నుతింప। దరమె న్యాతును నా మిత్రవరుల కరయు
నవ్యగుణధుర్య నారాయణాఖ్యవర్య॥

ఇట్లు విన్నవించువిధేయుడు,
చౌదరి- గారుచంద్రుపట్నాయకులు.

శ్రీ సద్గురవేనమః

# వేదాంత చూర్ణిక



శ్రీ మత్సమస్తయోగశాస్త్రోక్తాహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహక్షమాధృత్యనుకంపార్జవమితాహారశౌచతపస్సంతోషాస్తిక్యత్యాగేశ్వర ప్రణిధాన శ్రవణలజ్జామతి జపవ్రతాద్యుపదేశ నిర్మలీకృత నిజచ్ఛాత్రాంతరంగం మోక్షలక్ష్మీసంగం॥ దూరీకృతరోగస్త్యాన సందేహాజాగ్రద తృప్తి భ్రిమానవస్థితా ద్యంతరాయాంధతమస్సందోహం విదళితమోహం॥ మత్స్యేంద్రపద్మవీర స్వస్తికగోముఖ పశ్చిమతానవల్లకీ సర్వాంగతాళ్య కూర్మమాయూర టిట్టిభ కుక్కుటశోభా పర్యంక మహాభేకనకపాల ధనుర్భద్రకశేంద్ర పాణియోగ ఖేచర్యాది మహాసన సిద్ధిదావానల ప్రజ్వలజ్వాలికాజాల భస్మీభూతకాసశ్వాస హిక్కాశోథక్షయా జీర్ణాది మహావృక్ష సంకులసంకలిత గదారణ్యాం భక్తజన శరణ్యాం.—

ధౌతివస్తి త్రాటక శంఖప్రక్షాళననేతి నౌలికిలి చక్రికపాలభాతి ప్రముఖసత్కర్మయంత్ర సముద్ధూత సర్వనాడీ ద్వారాంతరస్థిత దుర్మలదోషజాలం మృణాలవాలం। సూర్యభేదనోజ్జాయినీ శీతలీశీత్కారీ భస్త్రికాభ్రామర్యాస్యంత ద్బ

హిరణ్యభేదశాఖల కుంభకాఖ్యానవశీకృత ప్రాణశ్వాసనం విరహిత వ్యసనం—

మహాముద్రా మహాబంధు మహావేదఖేచర్యుడ్యాణమూల జాలంధరబంధశక్తి చాలనవజ్రోలీ విపరీత కరణ్యాది దశ విధ మహాముద్రాభ్యాస బలప్రబోధితకుండలినీ కన్యాకటాక్షవీక్షణా సంప్రాప్తాణి మాద్యష్టైశ్వర్యసంపన్నం। ప్రపోషిత విపన్నం॥—

కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యా సూయేర్ష్యా దంభదర్పాహంకారాది భయంకరశత్రుమత్త దంతావళి పంచాననం ప్రత్యక్ష పంచాననం॥—

తత్త్వమస్యహం బ్రహ్మాస్మ్యయమాత్మా బ్రహ్మేత్యాది మహావాక్య శ్రవణమననిధి ధ్యాసనా సంభూతాపరోక్షజ్ఞాన నిశితఖడ్గధారా విచ్ఛేదితాకారోకారమకార సత్వరజస్తమ స్థూలసూక్ష్మ కారణ మహాకారణ జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయవిశ్వతైజసప్రాజ్ఞ విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతాంతర్యామ్యహంకార మమకార ఇచ్ఛాజ్ఞాన క్రియాన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయ జీవేశ్వర సత్య వైకుంఠ కైలాస స్వర్గ నరక పుణ్యాపాపబంధ మోక్ష దేహ వర్ణాశ్రమ కులగోత్ర నామరూప జరామరణ శోకమోహ క్షుత్పిపాసాభయరాగద్వేష జడాజడ పంగ్వంధ బధిర మూక దీర్ఘహ్రస్వాకృష్ణ బాహ్యాంతరాగామిసంచిత ప్రారబ్ధదృష్టా త్వ

దర్శనత్వ దృశ్యత్వ కర్తృత్వ భోక్తృత్వ ప్రముఖసాంద్రభ్రాంతి లతాబృందం ఉపనిషత్ప్రద్యుకందం॥—

శబ్దస్పర్శరూపరసగంధ తన్మాత్ర సహిత పృథివ్యాపస్తేజో వాయురాకాశ నామక పంచభూత సంభూతభూర్భువస్స్వర్ మహార్ జనస్తప స్సత్యాతల వితలతలాతల రసాతల మహాత ల పాతాళాద్యఖండ భువనాంతరస్థిత బ్రహ్మావిష్ణు రుద్రేశ్వర సదాశివ సూర్యచంద్రాగ్ని యమవరుణవాయు కుబేరాది త రంగ సందోహ విరాజమాన నిర్వికల్ప నిర్వికార నిరాకార నిరంజన నిరవయవ నిర్విశేష నిరీహ నిష్కారణ నిష్కళంక నిరామయ భూతభవిష్యద్వర్తమానకాలా బాధ్యమాన స ర్వవస్తుపరిచ్ఛేద శూన్యస్వప్రకాశ సర్వప్రకాశక కేవల పరి పూర్ణ సచ్చిదానంద సాక్షాత్కారం సర్వవేదాంత సారం॥—

నిరంతరలీలా ప్రముఖ తానసమన్విత శిరపూరివంశ పయః పారావారపూర్ణసుధాకరోపమాన భాస్కరనృసింహారాధ్యా క్రియాశిష్యాంతః కరణస్థితానేక జన్మకృత సుకృతవా సనావశ సంలబ్ధ నిరంకుశ తృప్తిఫలం అత్యంత నిశ్చలం సద్గు రుం తం భజామ్యహం తం భజామి॥

సంపూర్ణము.

శ్రీమద్గురవేనమః.

# చిదానంద దండకము.

శ్రీమచ్చిదానందకందా స్వశక్తిప్రదీప్య జ్జగద్బృంద సర్వా మరవ్రాతసంపూజ్యపాదారవిందా యవధ్వస్త సంసారబంధా ముకుందా యమాయం బమేయం బహేయం బగేయం బశోకం బలోకం బకామం బనామం బనీహం బమోహాం బరూపం బతాపం బకోపం బపాపం బరోగం బరాగం బభోగం బబాధం బసంగం బనంగం బభంగం బలింగం బలోభం బలాభం బనాధార మాధార మజ్ఞేయ మధ్యేయ మాద్యం బనాద్యం బబాధ్యం బబోధ్యం బసాధ్యం బభేద్యం బనాఖ్యం బశక్యం బసాంఖ్యం బశంక్యం బమంత్రం బతంత్రం బనీశం బనాశం బకోశం బసాత్యం బలక్ష్యం బధర్మం బకర్మం బమూలం బఖేలం బనగ్రం బనుగ్రం బలిప్తం బతృప్తం బసుప్తం బతప్తం బనాప్తం బబద్ధం బమిద్ధంబు శుద్ధంబు బుద్ధంబు సిద్ధం బవిద్ధం బశాంతం బనంతం బపక్షం బనక్షం బదక్షం బమోక్షం బమాత్రం బగోత్రం బబాహ్యం బగుహ్యం బముహ్యం బదాహ్యం బపారం బదూరం బశోష్యం బదూష్యం బనజ్ఞాన మజ్ఞాన మేకం బనేకం బనుక్తం బయుక్తం బభూతం బజాతం బపాతం బపూతంబు ప్రాచ్యేముఖీముఖ్యసర్వేంద్రియోద్దీపకం బజ్జగర్భాండ భాండ ప్రకాండావబాహ్యాంతర వ్యాపకంబై వెలుంగొందు నీదివ్యయాధార్థ్యతత్వంబు నెవ్వారికైనం దరంబౌనె వర్ణింపనాహా నిరస్తాఖిలోపాధికా సూక్ష్మదోశ్చండదైత్యా సుస్థిరాలోలనీరంబులన్ దాననన్వర్గ్వ

భావ్యస్వరూపుండుగా దోచులీలన్ ప్రభిన్నంబులౌ నత్త్వసీమా
విశేషంబులందెల్ల విభ్రాజమానుండవై యంబరంబట్లు మా
యామయాశేష భూతాళిపూర్ణుండవై యుండి యవ్వాని న
న్నింటి భాస్వంబులౌనట్లు గావించి తత్తద్వికారంబులం జెందకే
సాక్షిమాత్రుండవై స్వప్రకాశుండవై యుందు వీవేగదా
వారిరాశిన్ తరంగంబులున్ బోలె నీయందెగా భూజలాగ్న్యా
దిభూతంబులున్ తద్వికారంబులౌ లోకజాలంబులున్ పంచత
న్మాత్రలున్ వర్తమానాదికాలత్రయంబున్ దిశావ్రాతమున్
సూర్యచంద్రాదులున్ సప్తవారాసులున్ సత్కులాగంబు
లున్ వీరువా రిద్దియద్దంచు వేర్వేరుగా జెప్పగానేల బ్రహ్మాది కీ
టాంత నానావిధానూనజీవౌఘముల్ జన్మవృద్ధిక్షయంబుల్ వె
సన్ బొందుచుండున్ మహాదేవకూటస్థచైతన్యమాత్రా నినున్ వీ
తనామక్రియారూప జాత్యాశ్రమాచారకర్తృత్వభర్తృత్వహ
ర్తృత్వద్రష్టృత్వ దృశ్యత్వముఖ్యాఖిలాంచత్ప్రవైకారికుంగాప్ర
పూర్ణాత్ముగానెంచి భావించగా శక్తిలేమిన్ విమూఢాత్మకుల్ నీ
యడన్ బెన్వికారంబులన్ గల్పనల్ జేసి యీశుండవంచున్
రమేశుండవంచున్ గణేశుండవంచున్ దినేశుండవంచున్ మరిన్
వాగధీశుండవంచున్ మహాశక్తిరూపుండవంచున్ విరాడ్రూ
పివంచున్ జగన్నాటకప్రక్రియాసూత్రధారుండవంచున్ వివ
స్వన్మహామండలాంతర్గత జ్యోతిమాత్రుండవంచున్ మహ
ద్రూపివం చింక సూక్ష్మస్వరూపుండవంచున్ బ్రవిజ్ఞానమా
త్రాదివం చిట్టులన్ భిన్నభిన్నప్రకారంబులన్ భావనల్ జే

యుచున్ స్నానసంధ్యాద్యనుష్ఠానజాలంబులన్ ధ్యానదానం
బులన్ మంత్రతంత్రంబులన్ యాగయోగంబులన్ నిన్ను
బొందంగ నూహింతు రజ్ఞానులై వారికిన్ శక్యమే నీయథా
ర్థం బెఱుంగన్ దివాంధంబు వెల్గుం గనంజాలునే ఘోరపంచా
గ్నిమధ్యంబునందూర్ధ్వపాదుం డధశ్శీర్షకుండై శతాబ్దంబు
లెంతే తపోనిష్ఠచే నొప్పినన్ మీసలున్ గడ్డముం బెంచి కా
షాయ వస్త్రంబులం గట్టి బూదిన్ మెయిన్బూసి రుద్రాక్ష
మాలాధరుండై జనంబెల్ల నన్గాంచి మేల్మేల్ భళీయంచు
మెచ్చన్ బకధ్యానముల్ సేయుచున్నన్ గయాకాశికా శ్రీ
జగన్నాథరామేశ్వరాద్యుత్తమక్షేత్రముల్ జేరి తత్తస్థలస్థాప
గా శ్రేణిలో గ్రుంకి సద్బ్రాహ్మణశ్రేణి గోభూహిరణ్యాగ్రహా
రాన్నవస్త్రాదిదానంబులన్ తృప్తులన్ జేసి తద్దేవతానీకసంద
ర్శనంబుల్ కడున్ భక్తి గావించి పూజాభిషేకాదులన్ జేసినన్
పద్మమాయూర సింహోష్ట్రకోధ్యాఘ్రాంఘ్రి శీర్షాదిపీఠంబులన్
ధౌతివస్త్యాదిషట్కర్మలన్ నాడికాద్వారముల్ శుద్ధి గావిం
చి యమ్మూలజాలంధరోడ్యాణబంధంబులన్ గంధవాహాళిస్రీస
ద్గురూక్తిన్ నిరోధించియాధారచక్రస్థయా కుండలీశక్తికన్ లే
పి చేతస్సమేతంబుగా ప్రాణమున్ మధ్యమార్గంబులో జొన్పి
కొంపోయి యాజ్ఞాసరోజాంతరాళంబునన్ జేర్చినన్ జిత్రపుం
బొమ్మలన్ జిత్రకారుండునుంబోలె నీసర్వభూతంబులన్ వెఱ్ఱి
చందాల నాడించుచున్నట్టి యజ్ఞాన మావంతయున్ బోవు
నే ఘోరసంసారదుర్వారబంధంబు దా వీడునే ముక్తి జే

కూడునే ధ్వాంతపుంజంబు దీపంబు లేకన్ వినాశంబునుంబొం దునే జ్ఞానగమ్యా లసచ్ఛుక్తికాజ్ఞానమాత్రంబుచే గల్పితంబై న రూప్యంబు తచ్ఛుక్తికాజ్ఞానమాత్రంబుచే బోవుచందంబు గా నెద్దియెద్దాని యజ్ఞానమాత్రంబుచే గల్పితం బయ్యె నద్దా ని జ్ఞానంబుచేతన్ గదా బోవునం చట్టు లయ్యాత్మవిజ్ఞాన మొక్కండు లేకుంటచే దోచు సంసారబంధంబు తత్సచ్చిదా నందరూపాత్మవిజ్ఞానమాత్రంబుచే బోవునంచున్ సదాపండి తుల్ బ్రహ్మసత్యం జగన్మిథ్యయం చేకమేవాద్వితీయం పరబ్ర హ్మయంచున్ తదేవాహమం చిట్లభేదాను సంధానదృష్టిన్ ని నుంగాంచి దేహాత్మభావంబులన్ ద్రుంచి యజ్ఞానవల్లీనికుంజం బులన్ ద్రెంచి కైవల్యలక్ష్మీసమోపేతులై కర్మతుల్ దమ్ముదూ షించినన్ పెల్లుభూషించినన్ ఖేదమోదంబులున్ వాదభేదం బులున్ లేక క్రీడింపుచున్ కుంభనాశంబునన్ దద్గతాకాశమం చన్మహాకాశముం బొందురీతిన్ దుదిన్ నిస్తులానందకందం బ పస్పందమహానేపదంబొంది దారవ్వలన్ జన్మబంధంబులన్ జి క్కరో యట్టియుష్మత్స్వరూపంబు జన్మాంతరప్రాప్తసత్సంగ సంస్కారలేశంబునన్ తావకాత్మీయ కారుణ్యసంభృతకటా క్షంబునన్ధాత్రి నేరళ్లనారాయణాఖ్యుండనౌ నేనునిక్కంబు గా గాంచితిన్ శరచ్ఛశాంకాననకాప్రపంచంబు సంభిన్నయోాం భోధిలో ముంచితిన్ నిష్కళంకా నమస్తే నమస్తే నమస్తే॥

చిదానంద దండకము

గా శ్ర ము.

